# అథ దశమో%ధ్యాయః

# నరక యాతనలు

సనత్కుమార ఉవాచ|

మిథ్యాగమం ప్రవృత్తస్తు ద్విజాహ్వాఖ్యే చ గచ్ఛతి |
జిహ్వార్ధకోశవిస్తీర్ణహలైస్తీక్ష్ణైః ప్రపీడ్యతే || 1

నిర్భర్త్సయతి యః క్రూరో మాతరం పితరం గురుమ్ | విష్ఠాభిః
కృమిమిశ్రాభిర్ముఖమాపూర్య హన్యతే || 2

యే శివాయతనారామవాపీకూపతడాగకాన్ | విద్రవంతి ద్విజస్థానం
నరాస్తత్ర రమంతి చ ||3

కామాయోద్వర్తనాభ్యంగస్నానపానాంబుభోజనమ్ | క్రీడనం
మైథునం ద్యూతమాచరంతి మదోద్ధతాః ||4

పేచిరే వివిధైర్ఘోరైరిక్షుయంత్రాదిపీడనైః | నిరయాగ్నిషు పచ్యంతే
యావదాభూతసంప్లవమ్ || 5

తేన తేనైవ రూపేణ తాడ్యంతే పారదారికాః | గాఢమాలింగ్య తే
నారీం సుతప్తాం లోహనిర్మితామ్ || 6

పూర్వాకారాశ్చ పురుషాః ప్రజ్వలంతి సమంతతః | దుశ్చారిణీం
స్త్రియం గాఢమాలింగంతి రుదంతి చ || 7

యే శృణ్వంతి సతాం నిందాం తేషాం కర్ణప్రపూరణమ్ |
అగ్నివర్ణైరయఃకీలైస్తపై#ైస్తామ్రాదినిర్మితైః || 8

త్రపు సీసారకూటద్భిః క్షీరేణ చ పునః పునః | సుతప్తతీక్ష్ణతైలేన
వజ్రలేపేన వా పునః || 9

క్రమాదాపూర్వ కర్ణాంస్తు నరకేషు చ యాతనాః | అనుక్రమేణ
సర్వేషు భవంత్యేతాస్సమంతతః || 10

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

అధర్మమును బోధించే ఆగమములను పాటించువాడు ద్విజిహ్వము అనే నరకము పొంది, నాలుకవలెనుండే, మైలు దూరమువరకు విస్తరించి యున్న వాడి నాగళ్లచే పీడించ బడును (1). ఏ క్రూరుడైతే తల్లిదండ్రులను, గురువును గద్దించునో, వానిని నోటిలో క్రిములతో నిండిన మాలిన్యమును నింపి కొట్టెదరు (2). ఏ మానవులైతే మదముచే గర్వించిన వారై శివాలయమును, సత్రము, నుయ్యి, దిగుడు బావి, చెరువు, బ్రాహ్మణస్థానము అనువాటిని దుర్వినియోగము చేసెదరో, అనగా అచట క్రీడించుట, సంభోగించుట, లేపనములను మరియు నూనెను రాసుకొని స్నానమాడుట, మద్యమును సేవించుట, విలాసభోజములను చేయుట, జూదమాడుట మొదలగు పనులను చేయుదురో, వారు ప్రలయకాలము వరకు నరకములోని చెరుకు గానుగలయందు నలుగ కొట్టబడి నిప్పులలో ఉడికించ బడెదరు (3-5). పరస్త్రీ వ్యామోహము గల వారిని వారు ప్రేమించిన స్త్రీ యొక్క లోహవిగ్రహమును చేసి దానిని గట్టిగా కౌగిలించుకొనునట్లు చేసి, కొట్టెదరు (6). చెడు ప్రవృత్తి గల స్త్రీలు వారు ప్రేమించిన పురుషుల కాలే విగ్రహములను కౌగిలించు కొనునట్లు చేయుటచే వారు రోదించెదరు (7). ఎవరైతే సత్పురుషుల నిందలను వినెదరో, వారి చెవులలో అగ్ని వలె ప్రకాశించే, రాగి ఇనుము తగరము సీసము కంచు మొదలగు లోహములచే చేయబడిన, కాలుచున్న మేకులను, కాలుచున్న నీటిని, పాలను, నూనెను, మరియు వజ్రపు చూర్ణమును దట్టముగా నింపెదరు (8, 9). ఈ విధముగా నరకములలో చెవులను మాత్రమే గాక, క్రమముగా సర్వావయవములను దట్టముగా నింపి అన్ని వైపులనుండి యాతనలను పెట్టెదరు (10).

సర్వేంద్రియాణామప్యేవం క్రమాత్పాపేన యాతనాః | భవంతి ఘోరాః ప్రత్యేకం శరీరేణ కృతేన చ || 11

స్పర్శదోషేణ యే మూఢాస్స్పృశంతి చ పరస్త్రియమ్ | తేషాం కరో%గ్నివర్ణాభిః పాంశుభిః పూర్యతే భృశమ్ || 12

తేషాం క్షారాదిభిస్సర్వైశ్శరీరమనులిప్యతే | యాతనాశ్చ మహాకష్టాస్సర్వేషు నరకేషు చ || 13

కుర్వంతి పిత్రోర్భ్రు కుటిం కరనేత్రాణి యే నరాః | వక్త్రాణి తేషాం సాంతాని కీర్యంతే శంకుభిర్దృఢమ్ || 14

యైరింద్రియైర్నరా యే చ కుర్వంతి పరస్త్రియమ్ | ఇంద్రియాణి చ తేషాం వై వికుర్వంతి తథైవ చ || 15

పరదారాంశ్చ పశ్యంతి లుబ్ధాః స్తబ్ధేన చక్షుషా | సూచీభిశ్చాగ్నివర్ణాభిస్తేషాం నేత్రప్రపూరణమ్ || 16

క్షారాద్యైశ్చ క్రమాత్సర్వా ఇహైవ యమయాతనాః | భవంతి మునిశార్దూల సత్యం సత్యం న సంశయః || 17

దేవాగ్నిగురువిప్రేభ్యశ్చానివేద్య ప్రభుంజతే | లోహకీలశ##త్రైస్తపై#్తస్తజ్జిహ్వాస్యం చ పూర్యతే || 18

యే దేవారామపుష్పాణి లోభాత్సంగృహ్య పాణినా | జిఘ్రంతి చ నరా భూయశ్శిరసా ధారయంతి చ || 19

ఆపూర్యతే శిరస్తేషాం తపై#్తర్లోహస్య శంకుభిః | నాసికా వాతిబహులైస్తతః క్షారాదిభిర్భృశమ్ || 20

మానవుడు శరీరములోని ఏయే ఇంద్రియములచే పాపమును చేసినాడో, ఆయా ఇంద్రియములు అన్నింటికీ క్రమముగా ప్రత్యేకించి ఇదే విధముగా ఘోరమైన యాతనలు కలుగును (11). ఏ మూర్ఖులైతే పరస్త్రీని స్పృశించెదరో, ఆ స్పర్శదోషముచే వారి చేతులు నిప్పుల వలె కాలే బూడిదతో దట్టముగా నింపబడును (12). వారికి దేహమునకు క్షారము మొదలైన వాటిని అన్నింటినీ పూసి నరకములన్నింటియందు మహాకష్టమును కలిగించే యాతనలను పెట్టెదరు(13). ఏ మానవులైతే కనుబొమ్మలను ముడిచి చేతులను త్రిప్పుతూ కన్నులతో కోపముగా చూచెదరో, వారి ముఖములను ఈ కొననుండి ఆ కొన వరకు మేకులతో గట్టిగా గీసెదరు (14). ఏ ఇంద్రియములచే మానవులు ఇతరస్త్రీలకు

హానిని కలిగించెదరో, వారి ఆ ఇంద్రియములను వికృతమొనర్చెదరు (15). పరభార్యలను పాపబుద్ధితో చూచు కాముకుల కళ్లలో నిప్పుల వలె ప్రకాశించే సూదులను గుచ్చెదరు (16). ఓ మహర్షీ! ఈ నరకమునందు క్షారమును మీద పోయుట మొదలగు యమయాతనలను పాపులు అందరు అనుభవించెదరనుటలో సందేహము ముమ్మాటికీ లేదు (17). ఎవరైతే దేవతలకు, అగ్నికి, గురువునకు, బ్రాహ్మణులకు నివేదించకుండగా భక్షించెదరో, వారి నాలుకను మరియు నోటిని వందలాడి కాలే ఇనుప మేకులతో నింపెదరు (18). ఏ మానవులైతే దేవాలయములోని పుష్పములను ఆశవలన చేతితో కోసి ఆఘ్రాణించెదరో, మరియు శిరస్సుపై ధరించెదరో (19), వారి తల కాలే ఇనుప శంకువులతో నింపి వేయబడును. ఇంతే గాక, ముక్కులో క్షారము మొదలగు వాటిని అధిక మాత్రలో పోసెదరు (20).

యే నిందంతి మహాత్మానం వాచకం ధర్మదేశికమ్ | దేవాగని గురుభక్తాంశ్చ ధర్మశాస్త్రం చ శాశ్వతమ్ || 21

తేషామురసి కంఠే చ జిహ్వాయాం దంతసందిషు | తాలున్యోష్ఠే నాసికాయాం మూర్ధ్ని సర్వాంగసంధిషు || 22

అగ్నివర్ణాస్తు తప్తాశ్చ త్రిశాఖా లోహశంకవః | ఆఖిద్యంతే చ బహుశః స్థానేష్వేతేషు ముద్గరైః || 23

తతః క్షారేణ దీప్తేన పూర్యతే హి సమంతతః | యాతనాశ్చ మహత్యోవై శరీరస్యాతి సర్వతః || 24

అశేష నరకేష్వేవ క్రమంతి క్రమశః పునః | యే గృష్ణంతి పరద్రవ్యం పద్భ్యాం విప్రం స్పృశంతి చ || 25

శివోపకరణం గాం చ జ్ఞానాదిలిఖితం చ యత్ | హస్తపాదాదిభిస్తేషామాపూర్యంతే సమంతతః || 26

నరకేషు చ సర్వేషు విచిత్రా దేహయాతనాః | భవంతి బహుశః కష్టాః పాణిపాదసముద్భవాః || 27

శివాయతనపర్యంతే దేవారామేషు కుత్రచిత్ | సముత్సృజంతి యే పాపాః పురీషం మూత్రమేవ చ || 28

తేషాం శిశ్నం సవృషణం చూర్ణ్యతే లోహముద్గరైః | సూచీభిరగ్నివర్ణాభిస్సంఛిత్త్వా పూర్యతే పునః || 29

తతః క్షారేణ మహతా తీవ్రేణ చ పునః పునః | ద్రుతేన పూర్యతే గాఢం గుదే శిశ్నే చ దేహినః || 30

ఎవరైతే మహాత్ముని, ప్రవచనమును చెప్పువానిని, ధర్మాచార్యుని దేవతలను, అగ్నిని, గురువును, భక్తులను మరియు శాశ్వతమగు ధర్మశాస్త్రమును నిందించెదరో (21), వారి వక్షఃస్థలము, కంఠము, నాలుక, దంతముల మధ్యలోని ఖాళీ స్థానములు, తాలువు, పెదవి, ముక్కు, తల, అన్ని కీళ్లు అను స్థానములలో (22), అగ్నివలె ప్రకాశించే కాల్చిన మూడు కొనలు గల లోహపు మేకులను అనేకవిధములుగా గుచ్చి సుత్తులతో మోదెదరు (23). తరువాత వారిని మరిగే క్షారమునందు ముంచి, శరీరముయొక్క అన్ని భాగములలో మహాయాతనలను కలిగించెదరు (24). ఎవరైతే ఇతరుల ద్రవ్యమును సంగ్రహించెదరో, పాదములతో బ్రాహ్మణుని స్పృశించెదరో, వారు క్రమముగా అన్ని నరకములను మరల ప్రవేశించి ముందుకు సాగెదరు (25). శివపూజాసాధనమును, గోవును, జ్ఞానమును కలిగియున్న వ్రాతప్రతిని ఎవరైతే చేతితో పాడుచేసెదరో, లేదా పాదములతో త్రొక్కెదరో, వారు పైన చెప్పిన ద్రవ్యములన్నింటియందు ముంచబడెదరు (26). నరకములన్నింటియందు విచిత్రములగు శరీరయాతనలు పలువిధములుగా చేతులపై మరియు కాళ్లపై ప్రయోగించబడును (27). ఏ పాపాత్ములైతే శివాలయమునకు సమీపములో, మరియు పరమేశ్వరుని ఉద్యానములలో ఎక్కడైననూ మూత్రపురీషములను విసర్జించెదరో (28). వారి జననేంద్రియములను ఇనుప కడ్డీలతో చూర్ణము చేసి, అగ్నివలె ప్రకాశించే సూదులను గుచ్చి, పైన చెప్పిన ద్రవ్యములను వాటిపై పోసెదరు (29). తరువాత ఆ

ప్రాణియొక్క జననవిసర్జనేంద్రియములు కాలే క్షారముతో అధికపరిమాణములో దట్టముగా పలుమార్లు నింపి వేయబడును (30).

మనస్సర్వేంద్రియాణాం చ యస్మాద్దుఃఖం ప్రజాయతే | ధనే సత్యపి యే దానం న ప్రయచ్ఛంతి తృష్ణయా || 31

అతిథిం చావమన్యంతే కాలే ప్రాప్తే గృహాశ్రమే | తస్మాత్తే దుష్కృతం ప్రాప్య గచ్ఛంతి నిరయే% శుచౌ || 32

యే%న్నం దత్త్వా హి భుంజంతి నశ్వభ్యస్సహ వాయసైః | తేషాం చ వివృతం వక్త్రం కీలకద్వయతాడితమ్ || 33

కృమిభిః పాణిభిశ్చోగ్రై ర్లోహతుండైశ్చ వాయసైః | ఉపద్రవైర్బహువిధైరుగ్రై రంతః ప్రపీడ్యతే || 34

శ్యామశ్చ శబలశ్చైవ యమమార్గానురోధకౌ | ¸° స్తస్తాభ్యాం ప్రయచ్ఛామి తౌ గృహ్ణీతామిమం బలిమ్ || 35

యే వా వరుణవాయవ్యా యామ్యా నైర్ఋత్యవాయసాః | వాయసా పుణ్యకర్మాణస్తే ప్రగృహ్ణంతు మే బలిమ్ || 36

శివామభ్యర్చ్య యత్నేన హుత్వాగ్నౌ విధిపూర్వకమ్ | శైవైర్మం త్రై ర్బలిం యే చ దదతే న చ తే యమమ్ || 37

పశ్యంతి త్రిదివం యాంతి తస్మాద్దద్యాద్దినే దినే | మండలం చతురస్రం తు కృత్వా గంధాదివాసితమ్ ||38

ధన్వంతర్యర్థమీశాన్యాం ప్రాచ్యామింద్రాయా నిఃక్షిపేత్ | యామ్యాం యమాయ వారుణ్యాం సదక్షోమాయ దక్షిణ || 39

పితృభ్యస్తు వినిక్షిప్య ప్రాచ్యామర్యమణ తతః | ధాతుశ్చైవ విధాతుశ్చ ద్వారదేశే వినిఃక్షిపేత్ || 40

శ్వభ్యశ్చ శ్వపతిభ్యశ్చ వయోభ్యో విక్షిపేద్భువి | దేవైః పితృమనుష్యై#్యశ్చ ప్రేతైర్భూతైస్సగుహ్యకైః || 41

వయోభిః కృమికీటైశ్చ గృహస్థశ్చోపజీవ్యతే | స్వాహాకారస్స్వధాకారో వషట్ కారస్తృతీయకః || 42

హంతకారస్తథైవాన్యో ధేన్వాః స్తనచతుష్టయమ్ | స్వాహాకారం స్తనం దేవాస్స్వధాం చ పితరస్తథా || 43

వషట్ కారం తథైవాన్యే దేవా భూతేశ్వరాస్తథా | హంతకారం మనుష్యాశ్చ పిబంతి సతతం స్తనమ్ || 44

ఎవరైతే ధనము ఉన్ననూ లోభముచే దానమును చేయరో, వారి మనస్సునకు మరియు అన్ని ఇంద్రియములకు దుఃఖము కలుగును (31). గృహస్థాశ్రమములో ఉండియు సమయమునకు ఇంటికి వచ్చిన అతిథిని ఎవరైతే అవమానించెదరో, వారు దాని వలన పాపమును పొంది అశుచియగు నరకమును పొందెదరు (32). ఎవరైతే కుక్కలకు మరియు కాకులకు పెట్టకుండగా అన్నమును భుజించెదరో, వారి నోటిని తెరిచి రెండు మేకులను కొట్టెదరు (33). మరియు లోపల క్రిములను, భయంకరమగు ప్రాణులను నింపి, ఇనుప ముక్కులు గల కాకులచే పొడిపించి, మరియు అనేకవిధములైన ఉగ్రమగు ఉపద్రవములకు లోను చేసి పీడించెదరు (34). శ్యామ (నల్లనిది), శబల (విచిత్రవర్ణము గలది) అనే రెండుకుక్కలు యమలోకమార్గములో వెళ్లనక్కర లేకుండగా అడ్డుకొనును. వాటికి ఈ అన్నమును సమర్పించుచున్నాను. అవి దీనిని స్వీకరించును గాక! (35) వరుణుని (పశ్చిమ), వాయువుయొక్క (వాయవ్యమూల), యముని (దక్షిణ), మరియు నిర్ఋతియొక్క (నైర్ఋతి మూల) దిక్కులయందు ఉండే పవిత్రమైన కర్మ గల కాకులు నేను ఇచ్చే ఈ అన్నమును స్వీకరించును గాక! (36) ఎవరైతే శివుని శ్రద్ధతో పూజించి అగ్నియందు యథావిధిగా వ్రేల్చి శివుని స్తుతించు మంత్రములచే అన్నమును ఈ విధముగా సమర్పించెదరో, వారు యముని (37) చూడకుండగనే స్వర్గమును పొందెదరు. కావున, ఈ విధముగా అన్నమును నిత్యము సమర్పించవలెను. చతురస్రాకారమగు మండలమును చేసి గంధము మొదలగు వాటితో దానిని పరిమళభరితము చేయవలెను (38). దానిలో ఈశాన్యమునందు

ధన్వంతరికి, తూర్పునందు ఇంద్రునకు, దక్షినమునందు యమునకు, పశ్చిమమునందు దక్షుడు మరియు ఉమలతో కూడియున్న శివునకు, దక్షిణమునందు (39) పితృదేవతలకు, తూర్పునందు అర్యమ అను దేవతకు, ద్వారదేశమునందు ధాత మరియు విధాతలకు నైవేద్యమునిడవలెను (40). కుక్కలకు, వాటి పాలకులకు, మరియు కాకులకు నేలపై అన్నమును చేయవలెను. దేవతలు, పితరులు, మనుష్యులు, ప్రేతములు, భూతములు, యక్షులు (41), పక్షులు మరియు క్రిమికీటకములు గృహస్థుని ఆశ్రయించి జీవించుచున్నవి. స్వాహాకారము, స్వధాకారము, వషట్కారము (42) మరియు హంతకారము అను నాలుగు ఆహుతిశబ్దములు గోవుయొక్క నాలుగు స్తనములు. దేవతలు స్వాహాకరాము అనే స్తనమును పితరులు స్వధాకారమును (43), ఇతరదేవతలు మరియు భూతపతులు వషట్ కారమును, మనుష్యులు హంతకారమును సర్వకాలములయందు త్రాగుచున్నారు (44).

యస్త్వేతాం మానవో ధేనుం శ్రద్ధయా హ్యనుపూర్వికామ్ | కరోతి సతతం కాలే సాగ్నిత్వాయోపకల్ప్యతే || 45

యస్తాం జహాతి వా స్వస్థస్తామిస్రే స తు మజ్జతి | తస్మాద్దత్త్వా బలిం తేభ్యో ద్వారస్థశ్చింతయేత్ క్షణమ్ || 46

క్షుధార్తమతిథిం సమ్యగేకగ్రామనివాసినమ్ | భోజయేత్తం శుభాన్నేన యథాశక్త్యాత్మభోజనాత్ || 47

అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే | స తస్మై#్మ దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి || 48

తతో%న్నం ప్రియమేవాశ్నన్నరః శృంఖలవాన్ పునః | జిహ్వావేగేన విద్ధో%త్ర చిరం కాలం స తిష్ఠతి || 49

యతస్తం మాంసముద్ధృత్య తిలమాత్రప్రమాణతః | ఖాదితుం దీయతే తేషాం భిత్త్వా చైవ తు శోణితమ్ || 50

నిశ్శేషతః కశాభిస్తు పీడ్యతే క్రమశః పునః | బుభుక్షయాతికష్టం హి తథా యాతి పిపాసయా || 51

ఏవమాద్యా మహాఘోరా యాతనాః పాపకర్మణామ్ | అంతే యత్ప్రతిపన్నం హి తత్సంక్షేపేణ సంశృణు || 52

యః కరోతి మహాపాపం ధర్మం చరతివై లఘు | ధర్మం గురుతరం వాపి తథావస్థే తయోః శృణు || 53

సుకృతస్య ఫలం నోక్తం గురుపాపప్రభావతః | న మినోతి సుఖం తత్ర భోగైర్బహుభిరన్వితః || 54

తథోద్విగ్నోతిసంతప్తో న భ##క్ష్యైర్మన్యతే సుఖమ్ | అభావాదగ్రతో%న్నస్య ప్రతికల్పం దినే దినే || 55

పుమాన్యో గురుధర్మా%పి సోపవాసే యథా గృహే | విత్తవాన్న విజానాతి పీడాం నియమసంస్థితః || 56

తాని పాపాని ఘోరాణి సంతి యైశ్చ నరో భువి | శతధా భేదమాప్నోతి గిరిర్వ్రజహతో యథా || 57

ఇతి శ్రీశివమహాపురాణ  ఉమాసంహితాయాం నరకగతివర్ణనం నామ దశమో%ధ్యాయః (10)

పరంపరగా వచ్చుచున్న ఈ గోవును ఏ మానవుడైతే శ్రద్ధగా పాలించునో, అనగా నిత్యము తన ధర్మమును యథాకాలముగా అనుష్ఠించునో, అట్టి అహితాగ్ని అగ్నిలోకమును పొందుటకు అర్హుడగును (45). ఎవడైతే ఆరోగ్యవంతుడై యుండి ఈ ధర్మానుష్ఠానమును పరిత్యజించునో, వాడు తామిస్రము అను నరకములో మ్రగ్గును. కావున, గృహస్థుడు ద్వారము వద్ద నిలబడి ఆహారమును సమర్పించి క్షణకాలము ధ్యానమును చేయవలెను (46). ఆకలితో బాధపడుతూ అదే గ్రామములో నున్న అతిథిని గృహస్థుడు తానే తినే భోజనముతో సమానమైన శుభమగు భోజనమును ఇచ్చి చక్కగా భుజింపజేయవలెను (47). అతిథి ఎవని గృహమునుండి నిరాశతో వెనుకకు మరలునో, వానికి తన

పాపమును ఇచ్చి, వాని పుణ్యమును తీసుకొని వెళ్లిపోవును (48). కావున, తాను మాత్రమే రుచ్యమగు అన్నమును భుజించు మానవుడు చిరకాలము నరకములో గొలుసులతో కట్టబడి, నాలుకపై వేగముగా గుచ్చబడిన ఊచ గలవాడై పడియుండును (49). నువ్వు గింజల పరిమాణములో వాని శరీరమునందలి మాంసమును ఊడబెరికి వానికి తినుటకై ఇచ్చెదరు. మరియు వాని శరీరమును కోసి రక్తమును తీసి వానికి ఇచ్చెదరు (50). తరువాత క్రమముగా దేహములోని అవయవములను అన్నింటినీ కొరడాలతో కొట్టెదరు. పాపులు అచట ఆకలి దప్పికలతో చాల క్లేశమును అనుభవించెదరు (51). పాపాత్ములు ఈ విధమైన మహాఘోరమగు యాతనలను అనుభవించెదరు. అంతములో వారికి లభించు దానిని గురించి సంక్షేపముగా వినుము (52). పాపమును అధికముగను ధర్మమును అల్పముగను, మరియు పాపమును అల్పముగను ధర్మమును అధికముగను ఆచరించు వారిద్దరి అవస్థలను వినుము (53). పాపము అధికమైనప్పుడు పుణ్యప్రభావము ఉండదు. అట్టివాడు బహుదుఃఖములను అనుభవించుటచే ఆ కాలములోని సుఖము లెక్క లోనికి రాదు (54). ఆతడు మిక్కిలి దుఃఖముతో మరియు ఉద్వేగముతో బాధపడును. ఒకనికి ఒక పూట మంచి ఆహారమును ఇచ్చిననూ, ప్రతి నిత్యము అన్నము లేకపోవుటచే, ఆతడు ఆ ఆహారమును ఆనందముగా భుజించలేడు. అదే విధముగా ప్రతి దినము అధికకష్టములను పడే వానికి చిన్న చిన్న సుఖములు ఆనందమును ఈయజాలవు (55). ధనవంతుడు వ్రతనియమము కొరకై ఒక రోజు ఉపవాసము చేసిననూ, దానిలో పెద్ద క్లేశమును పొందడు. అదే విధముగా, అధిక పుణ్యము గల వ్యక్తి చిన్న కష్టమును అనుభవించిననూ, ఆతనికి పెద్ద ఇబ్బంది ఉండదు (56). మానవుని వజ్రముచే కొట్టబడిన పర్వతము వలె వంద ముక్కలుగా చేయగల మహాపాపములు గలవు. ఈ లోకములో వాటిని ఆచరించు వారు అట్టి ఫలమును పొందెదరు (57).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు నరకయాతనలను వర్ణించే పదవ

